# దయావీరులు

చల్లా రాధాకృష్ణశర్మ



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# దయావీరులు

రచన

చల్లా రాధాకృష్ణశర్మ




ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2008**

**DAYAVIRULU**

*by*

***Challa Radhakrishna Sarma***

T.T.D Religious Publications Series No. 114



First Edition : 1983

Re-print : 2008

Copies: 1,000

***Published by***

**K.V. Ramanachary,** I.A.S.
Executive Officer
Tirumala Tirupati Devasthanams press
Tirupati.

*D.T.P. Type Setting*
Editor's Office T.T.D Tirupati.

***Printed at***

Tirumala Tirupati Devasthanams Press
Tirupati

# మున్నుడి

ఆధునిక ప్రపంచంలో-భౌతికప్రగతి ఎంత వేగవంతమవుతుందో ఆధ్యాత్మిక విజ్ఞానం అంతగా తగ్గుముఖంపడుతోంది. ఒక జాతి సమగ్రమైన అభివృద్ధిని సాధించడానికి దాని నాగరకత మాత్రమే దోహదపడదు. ఆ దేశానికున్న సంస్కృతి కూడా జతపడవలసి ఉంటుంది.

పరోపకారపరాయణత,త్యాగనిరతి, భూతదయ, సహానుభూతి, భక్తి ఇలాంటి సుగుణాలన్నీ మానవులలో చోటుచేసుకున్నప్పుడు మాత్రమే ఆ సమాజం పరిపూర్ణ వికాసాన్ని పొందగలుగుతుంది.

నేటితరంలో మానవీయవిలువల్ని పెంచిపోషించడానికి ఆధ్యాత్మిక గ్రంథాలు ఎంతగానో సహకరిస్తాయి. ఈ సత్యాన్ని దృష్టిలోపెట్టుకుని తిరుమల తిరుపతి దేవస్థానం ధార్మికగ్రంథాల్ని విరివిగా ప్రచురించి వెలువరిస్తోంది.

ఈ పథకంలో భాగంగా ద్వితీయ ముద్రణకు నోచుకుంటున్న "దయావీరులు" అనే చిన్న పుస్తకంలో ఉన్న ఉడుతభక్తి, ధర్మరాజుభూతదయ, జీమూతవాహనుడు, మనునీతిచోళుడు, నామదేవుడు అనే కథలు పరోపకార గుణాన్ని పెంపొందించుకోవడానికి అత్యంత ఉపయుక్తాలు అవుతాయనడంలో అతిశయోక్తిలేదు.

ఇంత మంచిపుస్తకాన్ని అందించిన చల్లారాధాకృష్ణశర్మ అభినందనీయులు. ఇలాంటి ఉత్తమ రచనలను ఆదరిస్తున్న పాఠకులు ప్రశంసాపాత్రులు.

బి. కరుణాకరరెడ్డి

**( భూమన కరుణాకరరెడ్డి)**

అధ్యక్షులు

తి తి. దే. పాలకమండలి, తిరుపతి.

# ఆముఖం

మన భారతదేశం ఎందరో త్యాగధనులకు పుట్టినిల్లు. ఆదర్శవంతమైన జీవితాలను గడపడానికి ఆ మహానుభావులు ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొన వలసివచ్చినా మొక్కవోని ధైర్యంతో నిలబడి చరితార్థులై వున్నారు. యుగాలు గడిచిన మానవాళికి వాళ్ళజీవితగాథలు మార్గదర్శకాలుగా నిలిచాయి. మానవులే కాదు పశుపక్ష్యాదులు కూడా తమ త్యాగనిరతిని చాటిచెప్పిన ఘట్టాలు మన ఇతిహాసపురాణాలలో చోటు సంపాదించుకున్నాయి.

శ్రీ చల్లారాధాకృష్ణశర్మగారు రచించిన దయావీరులు అనే చిరు పుస్తకంలో-శ్రీ రాముడు లంకకు కడుతున్న వారధి నిర్మాణంలో తనవంతు సహకారాన్ని అందించిన ఉడుతభక్తిని గురించి, స్వర్గమార్గాన తనతోపాటు నడిచివచ్చిన కుక్కను కూడా మార్గమధ్యంలో వదలిపెట్టిరావడానికి ఇచ్ఛగించని ధర్మరాజు భూతదయను గురించి, తన కుమారుని గరుడునికి ఆహారంగా పంపలేక విలపిస్తున్న నాగమాతను ఓదార్చి తాను ప్రాణత్యాగానికి సిద్ధమయిన జీమూతవాహనుని గురించి, యువరాజు రథచక్రాలక్రింద పడి ప్రాణాలువదలిన ఆవుదూడను చూచి తనకు న్యాయం చేయమని కోరిన గోమాతను ఓదార్చి, తన కుమారుడైన యవరాజును తన రథచక్రాలతో త్రొక్కించడానికి వెనుకాడని మనునీతిచోళుని గురించి, తనదగ్గరకు వచ్చిన కుక్కకు నేతిగారెలు తినిపిస్తూ ఆ ప్రాణిలోకూడా తన ఆరాధ్యదైవమైన పాండురంగని దర్శించిన నామదేవుని గురించి- ఐదుకథలు ఉన్నాయి. ఈ పంచకథా పంచామృతాన్ని పాఠకులు తనివితీరా ఆస్వాదించగలరనడంలో సందేహంలేదు

తిరుమల తిరుపతి దేవస్థానములు ధార్మికగ్రంథప్రచురణలో భాగంగా 1982లో ప్రథమ ముద్రణ పొందిన ఈ 'దయావీరులు' అనే పుస్తకం ఇప్పుడు పునర్ముద్రణకు సిద్ధమౌతోంది. యథాపూర్వకంగా పాఠకులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని నమ్ముతున్నాను.

(కె.వి.రమణాచారి)
కార్యనిర్వహణాధికారి
తి.తి.దేవస్థానములు, తిరుపతి.

## ఉడుతభక్తి

(మనదేశంలో మొట్టమొదట వెలుగులోకి వచ్చిన కావ్యం రామాయణం. దీన్ని వాల్మీకి అనే గొప్ప ఋషి సంస్కృతంలో వ్రాశాడు. ఆ తరువాత ఇది తెలుగు మొదలైన ఎన్నోభాషలలోకి వెలువడింది. కథ యెప్పటిదో! అయినా, నేటికీ యిది మన నాలుకలమీద నానుతూవుండడం నిజంగానే గొప్పవిషయం. తెలుగులో ఎన్నో రామాయణాలు ఉన్నాయి. వాటిలో ఒకటి రంగనాథ రామాయణం. ఆ పుస్తకంలో ఈ క్రిందికథ చెప్పబడింది.)

చూడడానికి వాళ్లు కోతులు! కాని మహాబలవంతులు. కొందరు లావుగా ఉన్నారు. మరికొందరు సన్నగా వున్నారు. కొందరు పొట్టి, ఇంకా కొందరు పొడుగు, వాళ్లల్లో ఉత్సాహం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. అది యింతా అంతా అని చెప్పలేము. ఎంతో ఉత్సాహం అన్నమాట!

వాళ్లు మహాబలవంతులే కాక చాలా మంచివాళ్లు కూడా! ఆ వానర వీరులు పెద్దపెద్ద చెట్లనుకూడా కూకటివేళ్లతో పెకలించి వేస్తున్నారు. పెద్దపెద్ద కొండల్ని దూదిపింజలులా అవలీలగా పైకి ఎత్తుతున్నారు. అంతేనా! ఆ చెట్లనీ, ఆ కొండల్నీ త్వరత్వరగా తీసుకుపోయి సముద్రంలోకి విసిరివేస్తున్నారు. మనం రాళ్లూ బంతులూ విసిరివేసినట్టుగా కొండమీద కొండ, ఆకొండమీద మరో కొండ; చెట్లమీద చెట్లు. అలా ఆ వానరవీరులు కొండలు పేరుస్తున్నారు సముద్రంలో, చూస్తుండగానే సముద్రం మధ్య ఒక పొడుగాటి పెద్ద కట్ట తయారవుతోంది. అది చూడడానికి చక్కగావుంది. దానిమీద హాయిగా నడిచి ముందుకి వెళ్లవచ్చు. ఆ పెద్దకట్టను ముసలికోతులు సేతువు సేతువు అంటున్నాయి. సంతోషంకొద్దీ, పడుచుకోతులు గోలచేస్తూ సేతువు సేతువు అంటున్నాయి. ఎవరినోట విన్నా అదే మాట!

సముద్రాన్ని దాటితేనే వానరవీరులు లంకలోకి వెళ్ళవచ్చు. అప్పుడు రావణాసురుడితో యుద్ధం చెయ్యడానికి వీలు కలుగుతుంది. అప్పుడే రామచంద్రుడికి సహాయం చేసినట్లవుతుంది.

రావణుడు లంకకు రాజు. గొప్పవీరుడు. కైలాసపర్వతాన్ని అమాంతంగా పైకిఎత్తి అందరినీ గజగజలాడించిన బలశాలి. దేవేంద్రుడు మొదలైనవారికి సింహస్వప్నంగా కనిపించిన ఘనుడు. అన్నీ వున్నాయి, ఏం లాభం? రాముడిభార్య అయిన సీతను అతడు అపహరించి, ఆమెను లంకలో అశోకవనంలో ఒకచోట వుంచాడు. ఆమెచుట్టూ రాక్షసస్త్రీలను కాపలావుంచాడు. అందువల్ల రావణుడితో యుద్ధంచెయ్యడం తప్పనిసరి అయింది.



సేతువు కట్టవలసిందిగా రాముడు వానరుల రాజయిన సుగ్రీవుణ్ణి ఆజ్ఞాపించాడు. ఆ పనిని ఆయన నీలుడు అనే ప్రముఖుడికి అప్పగించాడు.

వానరవీరుల సహాయంతో నీలుడు సేతువుకట్టడంలో మునిగిపోయాడు. అందుకు ఆయన తనశక్తి అంతా ధారపోశాడు.

ఒకనాడు సేతువుని చూడడానికి రాముడు బయలుదేరాడు. ఆయనవెంట సుగ్రీవుడు, లక్ష్మణుడు మొదలైనవారు కూడా బయలుదేరారు.

ఎక్కడెక్కడి కొండలూ బండలూ చెట్లూ చేమలూ తీసుకువచ్చి వానరవీరులు సముద్రంలోకి విసిరివేస్తున్నారు. వాటిని చక్కగా పేరుస్తున్నాడు నీలుడు.

కొంచెందూరంలో ఒక ఉడుత కనిపించింది. రాముడి చూపు దాని మీద పడింది.

వానరవీరులముందు ఉడుత ఎంతని! చాలా చిన్నది. కాని అది అలా అనుకోలేదు. 'సేతువుపని ఎంత తొందరగా అయితే అంత మంచిది. రాముడికి నా చేతనైన సహాయం నేను చెయ్యాలి' అని అనుకుంటూ వెంటనే రాముణ్ణి

మనస్సులో తలుచుకుంది. సముద్రంలో మునిగింది. తర్వాత ఇసుకలో పొర్లాడింది. అప్పుడు దాని ఒంటికి ఇసుక అంటుకుంది. ఆ అంటుకున్న ఇసుకను సేతువుమీదవున్న బండలసందున రాల్చింది.

తర్వాత ఉడుత మళ్లీ సముద్రంలో మునిగింది. ఇసుకలో పొర్లాడింది. అంటుకున్న యిసుకను ఆ తర్వాత సేతువుమీద రాల్చింది.

ఆ విధంగా ఆ చిన్నఉడుత తనకు చేతనైన సహాయం చేయసాగింది సేతువు త్వరగా పూర్తికావాలనే ఆశకొద్దీ.

ఆ దృశ్యం రాముణ్ణి ఆకర్షించింది. రెప్పవాల్చకుండా చూశాడు. చూసేకొద్దీ అంతులేని సంతోషం కలిగింది.

ఆ సంతోషంలో పక్కనేవున్న లక్ష్మణునిచూసి రాముడు యిలా అన్నాడు. "చూశావా!తమ్ముడూ! నామీద భక్తికొద్దీ ఆ ఉడుత సముద్రంలో మునిగి, యిసుకలో పొర్లాడి, ఆ యిసుకను సేతువుమీద రాలుస్తోంది. వానరవీరుల్లా చెట్టుచేమలు పెకలించడం ,కొండలూ బండలూ మోసుకురావడంవంటి పనులు నేను చెయ్యలేను, అయినా నా చేతనైనవిధంగా నేనూ కష్టపడతాను అనుకుని మనకు సహాయం చేస్తోంది. ఇదీ సహాయమంటే!"

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. కావలసింది భక్తిగాని మరొకటి కాదు" అన్నాడు లక్ష్మణుడు తడుముకోకుండా.

ఆ పక్కన వున్నవాళ్లుకూడా అవునవును 'అన్నట్టుగా తలలువూపారు. రాముడు దయాసముద్రుడు!

ఆయన వెంటనే ఆ ఉడుత దగ్గరికి వెళ్లాడు. ఎంతోప్రేమతో దాన్ని దగ్గరికి తీసుకున్నాడు. పట్టులాంటి దాని వీపుని మెల్లగా తన వేళ్లతో నిమిరాడు. ముచ్చటగా మూడుచారలు పడ్డాయి.

ఇంతకూ ఆ దయావీరుడి ప్రేమను పొందిన ఆ చిట్టిఉడుత గొప్పది. అది చూపిన భక్తి చాలా గొప్పది!

---

# ధర్మరాజు భూతదయ

పాండవులు చాలా మంచివారు. వారిని కౌరవులు ఎన్నో కష్టాలు పెట్టారు. అయినా కృష్ణపరమాత్ముని దయవల్ల వారు ఆ కష్టాలనుంచి గట్టెక్కగలిగారు. కృష్ణుడంటే పాండవులకు ఎంతో భక్తి. అది ఇంతా అంతా అని చెప్పలేము. పాండవులంటేనూ కృష్ణునికీ అంతే ప్రేమ. తన భక్తులను భగవంతుడు అన్ని వేళలలోనూ అన్ని కాలములలోనూ కాపాడుతూ వుంటాడు.

ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు-వీరిని పంచపాండవులంటారు. అందరికంటె పెద్దవాడు ధర్మరాజు.

పేరుకి తగినట్టుగానే ధర్మరాజుకి ధర్మశాస్త్ర విషయాలు బాగా తెలుసు. పైపెచ్చు చాలా మంచివాడు కూడా! ఆయనకి విరోధులనే వారు ఎవ్వరూ లేరు. అందువల్ల ధర్మరాజుకి 'అజాతశత్రువు ' అనే పేరు వచ్చింది. అనగా అంత మంచివాడన్నమాట ధర్మరాజు!

భీముడు మహా బలశాలి. అర్జునుడేమో విలువిద్యలో ఆరితేరినవాడు నకుల సహదేవులు కూడా గొప్పవారే. అయినప్పటికీ, వారంతా అన్నగారైన ధర్మరాజుని చాలా గౌరవించేవారు. అన్నమాటను జవదాటని సోదరులువారు!

ఇలా ఉండగా, ఒకనాడు కృష్ణపరమాత్ముడు కాలధర్మం చెందాడనే దుర్వార్తవిన్నాడు ధర్మరాజు. అంతే. ఆయన మనస్సు వెయ్యిముక్కలయింది. దుఃఖసముద్రంలో మునిగిపోయాడు.

'అయ్యో, కృష్ణా! నువ్వు మరణించావా ? మమ్మల్ని కంటికిరెప్పలా కాపాడిన కరుణామయుడివి నువ్వు! అన్నివేళలలోనూ మాకు అండదండగా నిలిచి మాకు ధైర్యంచెప్పావు. నీవంటి ఆప్తుడు మాకింక ఈ లోకంలో ఎవరున్నారు?' అంటూ ధర్మరాజు కన్నీరుమున్నీరుగా విలపించాడు. 'ఇక నేను జీవించను. కృష్ణుడులేని లోకంతో నాకు పనిలేదు.' అనుకున్నాడు చివరికి.

కృష్ణుని అన్నగారయిన బలరాముడు కూడ కాలధర్మం చెందాడు.

బలరామకృష్ణులు మరణించిన సంగతి భీముడు, అర్జునుడు మొదలైన వారికి కూడా తెలిసింది. ధర్మరాజువలె వాళ్ళుకూడా కృష్ణుడు, తమకు చేసిన సహాయాన్ని తలుచుకుని తలుచుకుని విలపించారు. కృష్ణుడులేని యీలోకంలో ఉండకూడదు. – అని వారూ అనుకున్నారు.

ఒక మంచిరోజు చూసుకుని ధర్మరాజు ఆయన నలుగురుతమ్ములూ స్వర్గలోకానికి బయలుదేరారు. అప్పుడు ఒక కుక్క కూడా వాళ్ల వెనకాలే బయలుదేరింది.

పాండవులు పేటలు, కోటలు, కొండలు, కోనలు ఎన్నో దాటుకుంటూ ముందుకి వెళ్లసాగారు.

వారితోపాటు ఆ కుక్కకూడా పేటలు, కోటలు మొదలైనవాటిని దాటి ముందుకి నడవసాగింది. అది అలా తమతోపాటు రావడం చూసి ధర్మరాజు చాలా ఆశ్చర్యపోయాడు, కుక్క యేమిటి, అలా రావడం ఏమిటి! అనుకున్నాడు.

మరి, స్వర్గలోకానికి వెళ్లడమంటే మాటలా!

పాండవులంతవారే దోవలో ఎన్నెన్నోకష్టాలు పడ్డారు. పాపం! భీముడు అర్జునుడు – ఇలా ఒక్కొక్కరే దారిలో కన్నుమూశారు.

తలలో నాలుకవలె మెలగిన తన సోదరులు మరణించడం చూసి ధర్మరాజు ఎంతగానో కంటతడి పెట్టాడు. మరణించినవారు ఇక తిరిగిరారుకదా అనుకుని ఎలాగో మనస్సుని రాయి చేసుకున్నాడు. తన్నుతాను ఓదార్చుకున్నాడు. ప్రయాణం సాగించాడు.

కష్టాలను ఏ మాత్రమూ లెక్కచేయకుండా ఆ కుక్కకూడా ధర్మరాజు వెనకాల నడవసాగింది. అదిచూసి ఆయన మరీ ఆశ్చర్యపడ్డాడు.

ధర్మరాజు స్వర్గలోకానికి వస్తున్న విషయం ఇంద్రుడికి తెలిసింది. ఏనుగెక్కినంత సంతోషం కలిగింది ఇంద్రుడికి. ధర్మరాజువంటి మంచివాణ్ణి చూసే అవకాశం కలిగింది కదా! అని ఆయన ఎంతో సంతోషించాడు. అది తన అదృష్టవిశేషం అనుకున్నాడు. ధర్మరాజుకి ఎదురుగావెళ్ళి ఆయన్ని ఆహ్వానించాలని ఇంద్రుడు అందమైన ఒక విమానం ఎక్కి ధర్మరాజుకి ఎదురువెళ్ళి, 'ధర్మరాజా! ఇవాళ చాలా మంచిరోజు. నా అదృష్టం పండింది. నీవంటి మహాపురుషుని చూడగలిగాను. నీ మంచితనంవల్ల నీకు స్వర్గం లభించింది. ఇదిగో విమానం. దీన్ని ఎక్కి స్వర్గలోకానికి రావలసిందిగా కోరుతున్నాను' అని వినయంగా అన్నాడు.

ఇంద్రుని మాటలువిని ధర్మరాజు సంతోషించాడు. ఇంద్రడికి తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

ఆ తర్వాత ధర్మరాజు కుక్కతోపాటు విమానం ఎక్కబోయాడు.

అప్పుడు ఇంద్రుడు ఇలా అన్నాడు. 'ధర్మరాజా! నీకు తెలియని ధర్మమంటూ ఏదీలేదు. అయినా చెపుతున్నాను. కుక్క నీచమైన జంతువుకదా! కుక్కతో విమానం ఎక్కవచ్చునా? నీ సోదరులనూ, నీ భార్యనూ దోవలో విడిచిపెట్టలేదా? అలాగే ఈ కుక్కనుకూడా విడిచిపెట్టడం మంచిది.'

'ఇంద్రా! నువ్వు చెప్పినట్లు కుక్క నీచమైన జంతువు కావచ్చు. కాని విశ్వాసంకల జంతువు. నేను స్వర్గలోకానికని బయలుదేరిన మరుక్షణంనుంచీ యీ కుక్క నాతోపాటు నడక సాగించింది. పేటలూ, కోటలూ, కొండలూ, కోనలూ ఎన్నోదాటి నావలె ఇక్కడికి వచ్చింది. నన్ను నమ్మివచ్చిన యీ కుక్కను నేనిప్పుడు మోసం చెయ్యవచ్చునా? నమ్మినవారిని మోసంచెయ్యడం మహాపాపం ' అన్నాడు ధర్మరాజు.

అయినా ఇంద్రుడు తృప్తిచెందలేదు. మళ్లీ ధర్మరాజు ఇలా అన్నాడు.

"నేను స్వర్గానికి నా సోదరులతోనూ భార్యతోనూ బయలుదేరిన మాట నిజమే. కాని దోవలోనే వారు మరణించారు. మరణించినవారు తిరిగిరారు. వారి కోసం విలపించి లాభములేదు. కాని యీ కుక్క నాలా ఎన్నోకష్టాలు

సహించి ఇక్కడికి వచ్చింది. కనుక దీన్నికూడా ఎక్కనివ్వండి. లేకపోతే నేను విమానం ఎక్కను.

ఇలా ధర్మరాజూ ఇంద్రుడూ మాట్లాడుకుంటూ ఉండగా, ఆ కుక్క యమధర్మరాజుగా మారిపోయింది.

యముడు ధర్మరాజును చూసి, 'నువ్వు ధర్మస్వరూపుడవని నాకు తెలుసు. నీకు తెలియని ధర్మములులేవు. అయినా నీ భూతదయను పరీక్షించాలనే కోరికకొద్దీ నేనిలా చేశాను. నీ భూతదయను చూసి చాలా సంతోషించాను. ఇక నీవు నిశ్చింతగా స్వర్గలోకానికి వెళ్ళవచ్చు' అన్నాడు నవ్వుతూ.

తర్వాత ధర్మరాజు విమానం ఎక్కి స్వర్గలోకానికి వెళ్ళాడు.

ధర్మరాజు ధర్మమూర్తియే కాక దయావీరుడు కూడా.

----

## జీమూతవాహనుడు

అనగనగా ఒకరాజు. ఆయన పేరు జీమూతకేతువు. ఆయన చాలాకాలం రాజ్యం చేశాడు. మంచివాడనీ, న్యాయమూర్తి అనీ కీర్తి గడించాడు. ముసలివాడయ్యేకొద్దీ ఆయనకు రాజ్యంచేయడం విసుగుగా తోచింది. రాజ్యం వదలిపెట్టి అడవులకువెళ్ళి తపస్సు చేసుకోవాలని అనుకున్నాడు.

జీమూతకేతువుకి జీమూతవాహనుడు అనే ఒక కుమారుడున్నాడు. తండ్రిలా అతడుకూడా గొప్పవాడే. చీమ మొదలు చిరుతపులిదాకా గల అన్నిప్రాణుల్నీ సరిసమానంగా ప్రేమించేవాడు. చిన్నచీమకుకూడా హానిచేసి యెరగడు. తలిదండ్రులంటే అతనికి అపారమైన భక్తి . వారిని సేవిస్తూ కాలం గడపాలని జీమూతవాహనుడు అభిలషించాడు. అందువల్ల తండ్రి రాజ్యం ఇచ్చినా, రాజ్యంచేయడానికి అతడు అంగీకరించలేదు. అప్పుడు తనలో తాను ఇలా అనుకున్నాడు. "ఈ రాజ్యభోగాలు నిలుకడలేనివి. వీటివల్ల సౌఖ్యం రవ్వంతైనా, ఉండదు. తలిదండ్రుల్ని సేవించేటప్పుడు కలిగే సౌఖ్యమే నిజమైన సౌఖ్యం".

ఇలా అనుకుని జీమూతవాహనుడు తనరాజ్యాన్ని మంత్రులకు ఒప్పగించాడు. ఆ తర్వాత కల్పవృక్షాన్ని పేదసాదలకు ఇచ్చివేశాడు. ఏది కోరితే అది యిస్తుంది కల్పవృక్షం! అది గనుక దగ్గరవుంటే సిరిసంపదలకు లోటు ఉండదు. అన్నవస్త్రాదులకు కొరతఉండదు. శత్రువులవల్ల భయం ఉండదు. అటువంటి కల్పవృక్షాన్ని బీదవారికి దానం చేశాడంటే, జీమూతవాహనుని దయ, త్యాగం ఎటువంటివో మనం ఊహించుకోవచ్చు.

తల్లినీ తండ్రినీ సేవిస్తూ జీమూతవాహనుడు కాలం గడపసాగాడు. తలిదండ్రులు ప్రత్యక్షదైవములని మన నమ్మకం.

ఇలా ఉండగా, ఒకనాడు జీమూతవాహనుడు చక్కని పర్ణశాలకోసం ఒక కొండమీదికి వెళ్ళాడు. దానిపేరు మలయపర్వతం. అది చూడముచ్చటగొలిపే కొండ. కిలకిలమంటూ అరిచే పక్షులతో, గలగలమంటూ పారే సెలయేళ్ళతో అది కలకలలాడుతూ ఉంటుంది. ఆ కొండమీద ఎందరో మునులు తపస్సు చేసుకుంటూ నివసిస్తున్నారు.

మలయపర్వతంమీద అటూ ఇటూ తిరుగుతూవుండగా జీమూత వాహనుడికి ఒకచోట ఒక చిన్నగుడి కనిపించింది. అది గౌరీదేవి గుడి. అమ్మవారిని దర్శించి వెడదామని అతడు గుడివద్దకు చేరుకున్నాడు.

గుడి దగ్గరపడేకొద్దీ జీమూతవాహనుడికి కమ్మని వీణాగానం వినిపించసాగింది. ఒక చెట్టుచాటున నుంచుని అతడు ఆ వీణాగానాన్ని వినసాగాడు. వింటూ ఈ లోకమునే మరచిపోయాడు. కొంతసేపటికి ఆ తియ్యని వీణాగానం కాస్తా ఆగిపోయింది. మాటలు వినవచ్చాయి.

జీమూతవాహనుడు చెట్టుచాటు నుండి బయటకువచ్చి ముందుకు నడిచాడు.

అమ్మవారి యెదుట ఒక రాజకుమార్తెతో తన చెలికత్తె మాట్లాడుతూ వుండడం అతడు చూశాడు. అమె చక్కనిచుక్క, పేరు మలయవతి.

మలయతి జీమూతవాహనుణ్ణి చూసిందో లేదో ఆమెమనస్సు అతని యందే లగ్నమయింది. అతన్ని పెళ్ళిచేసుకోవాలని అనుకుంది.

ఒక శుభముహూర్తాన మలయవతీ జీమూతవాహనులకు మహావైభవంగా వివాహం జరిగింది.

ఒకనాడు జీమూతవాహనుడు మలయపర్వతంమీద విహరిస్తూవుండగా ఒకచోట తెల్లనికొండ ఒకటి అతనికి కనిపించింది. ఆశ్చర్యపోయాడు. తీరా దానిదగ్గరకు వెళ్ళి చూసేసరికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. అది నిజంగా కొండ కాదు. కొండగా పేరుకుపోయిన పాముల ఎముకలగుట్ట!

ఆ ఎముకలగుట్టను చూసీచూడగానే జీమూతవాహనుడు నిలువునా నీరయిపోయినాడు. ఏమీ తోచలేదు. అలాగే చెట్టులా నిలబడిపోయాడు, అయ్యో! ఇక్కడ ఇన్ని పాములు చచ్చిపోయి వుండడానికి కారణం ఏమిటి? ఇన్ని పాముల్ని పొట్టను పెట్టుకున్న ఆ కఠినాత్ముడెవరో గదా! ఈ పాములకు నేనేమి సహాయం చెయ్యలేకపోయాను గదా! ఎంత దురదృష్టవంతుణ్ణి అని మిక్కిలి పరితపించాడు. పాములకు సంభవించిన ఆ కష్టంచూసి అతనిహృదయం సహించలేకపోయింది. ఎలాగయినాసరే, పాములకు తాను సహాయం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

అలా జీమూతవాహనుడు ఎముకలగుట్టను చూస్తూ పరితపించే సమయంలో "కొడుకా!కొడుకా! అప్పుడే నీకు నూరేళ్లు నిండాయా? అయ్యో!"

అనే మాటలు వినిపించాయి. జాలిగొలిపే ఆ మాటలు వినేనరికి జీమూతవాహనుని మనస్సు ముక్కలు ముక్కలయింది. అతని కళ్ళవెంబడి నీళ్ళు ధారగా వెలికివచ్చాయి. "ఎవరో పాపం 'కొడుకా,కొడుకా' అని యేడుస్తున్నారు, ఆమెకు నేను తప్పకుండా సహాయం చేసితీరాలి." అని అప్పటికప్పుడే నిశ్చయించుకున్నాడు.

మళ్ళీ,కొడుకా!కొడుకా! నిన్ను కాపాడేవాళ్ళు యింత పెద్దలోకంలో ఎవ్వరూ లేరా? నేను ఎంత దురదృష్టవంతురాలిని? నా గతి యింతేనా? అని వినిపించింది.

అది విని జీమూతవాహనుడు భరించలేకపోయాడు, "నేను కాపాడతాను. నేనున్నాను" అంటూ అతడు ఏడుపు వినవచ్చినవైపు పరుగెత్తాడు.

ఒకచోట అరవైయేళ్ళునిండిన ఒక అవ్వ 'కొడుకా,కొడుకా' అంటూ ఏడవడం జీమూతవాహనుడు చూశాడు. వెంటనే అతడు అక్కడికి బాణంలా దూసుకువెళ్ళాడు.

అడుగులచప్పుడు విని ఆ అవ్వ తన చీరకొంగుతో ముఖం కప్పుకొని "ఓ గరుత్మంతుడా! నన్ను తిను. నేను నీకు ఆహారంగా వచ్చాను. తొందరగా నన్ను తిను, ఆలస్యం చెయ్యకు" అని బతిమాలుకున్నట్లుగా చెప్పింది.

ఆ మాటలు వినేసరికి జీమూతవాహనుడి మనస్సు రంపపుకోత పెట్టినట్లయింది. అయితే పాముల మరణానికి కారణమేమిటో కొంచెం తెలిసింది. అమె భయాన్ని పోగొట్టాలని వెంటనే అతడు "అమ్మా! నేను గరుత్మంతుణ్ణి కాను. నీ కుమారుణ్ణి కాపాడేందుకు యిక్కడికి వచ్చాను. నీకు వచ్చిన కష్టమేమిటో చెప్పు. నేను గరుత్మంతుణ్ణి కాను." అన్నాడు.

అప్పటికిగాని ఆ అవ్వకు పోయినప్రాణాలు తిరిగిరాలేదు. చెదిరిపోయిన మనస్సు కుదుటబడింది. చీరముసుగును తీసివేసి ఇలా అంది. "ఓ దయామయా! నువ్వు మా అబ్బాయిని కాపాడడానికి వచ్చావా? ఏమోనాయనా! నా కంటికి

అంతా గరుత్మంతునిమయంగా కనిపిస్తోంది." ఆమెముఖంలో ఇప్పుడు సంతోషం కనిపించింది.

అవ్వ సంతోషంగా ఉండడంచూసి జీమూతవాహనుడు కూడా సంతోషించాడు. "ఇంతకూ మీ అబ్బాయి యెక్కడ? అతని పేరేమిటి?" అని అడిగాడు.

"నాయనా, ఇక్కడికి దగ్గర్లో ఒకగుడి వుంది. స్వామివారిని సేవించి వస్తానని యిప్పుడే అక్కడికి వెళ్ళాడు. మా అబ్బాయి పేరు శంఖచూడుడు."

"గరుత్మంతుడివల్ల వచ్చిన ఆపదయేమిటి?" అని మళ్ళీ అడిగాడు జీమూతవాహనుడు.

"నాయనా. చెప్పాలంటే ఒక పెద్ద కథవుంది." అంటూ అవ్వ యిలా మొదలుపెట్టింది.

"గరుత్మంతుడికీ పాములకూ మొదటినుంచీ విరోధం వుండేది. అందువల్ల గరుత్మంతుడు నాగలోకంమీదపడి పాముల్ని కనికరంలేకుండా తినేవాడు..........

ఆ మాటలు వినలేక జీమూతవాహనుడు 'శివ శివ' అంటూ చెవులు మూసుకున్నాడు. "అమ్మా, నాగలోకానికిరాజు వాసుకి అని విన్నాను. మరి, గరుత్మంతుడు అలా పాముల్ని బాధపెడుతూవుంటే వాసుకి ఏమీ చెయ్యలేదా?" అని అడిగాడు ఆదుర్దాగా.

చెయ్యకేం నాయనా – వాసుకి గరుత్మంతుణ్ని సమీపించి, 'నీకు పుణ్యం వుంటుంది. నా మాట విను. నువ్వు వస్తున్నావని వినగానే మా పాములన్నీ గజగజవణికి పోతున్నాయి. పాలుతాగే పసిపాపలుకూడా పాలుతాగడం మానివేస్తున్నారు. కనక నేను ఒక్కపాము చొప్పున ప్రతిరోజూ నీకు ఆహారంగా పంపుతూవుంటాను' అని ప్రార్థించాడు. అందుకు గరుత్మంతుడేమో 'సరే' అన్నాడు అని ఏడుపు దిగమింగి అవ్వ చెప్పింది.

"అయ్యో! వాసుకికి రెండువేల నాలుకలున్నాయి గదా! వాటిలో ఒక్కదైనా నన్నుతిని మిగిలిన పాముల్ని కాపాడమని గరుత్మంతుడికి చెప్పలేకపోయిందా?" అంటూ జీమూతవాహనుడు కంటతడి పెట్టాడు.

అవ్వ మళ్లీ యిలా చెప్పసాగింది.

"ఆనాటినుంచీ గరుత్మంతుడు మా నాగలోకంమీదపడి నాగకులాన్ని ధ్వంసంచెయ్యడం మానివేశాడు. కాని వాసుకి చేసిన నియమం అనుసరించి రోజూ ఒక్కపాముచొప్పున గరుత్మంతుని ఆహారంకింద చచ్చిపోతున్నది. ఇది ఎన్నో సంవత్సరాలుగా జరుగుతోంది. ఇవాళ మా అబ్బాయివంతు వచ్చింది ..........." అంటూ అవ్వ ఏడవసాగింది.

గరుత్మంతునిబారినుంచి పాముల్ని ఎలాగైనా కాపాడవలెనని జీమూతవాహనుడి మనస్సు తహతహలాడింది. అలాచేస్తే తనజన్మ సార్థకమవుతుందని అనుకున్నాడు.

ఇతరులకు ఉపకారంచెయ్యడానికి ముందువెనకల చూడని మహాత్ముడు జీమూతవాహనుడు.

ఆ తర్వాత అతడు అవ్వతో,"అమ్మా! మీ అబ్బాయికి బదులుగా నేను గరుత్మంతుడికి ఆహారంగా వెడతాను. ఇక దుఃఖంమాని నువ్వు నిశ్చింతగా వుండు. మీ అబ్బాయిని మీ వూరికి తీసుకువెళ్ళు" అన్నాడు.

అందుకు ఆ అవ్వ, "నాయనా, యిలాఅనడం నీకు తగదు, మా అబ్బాయి దురదృష్టవంతుడు, నేనూ అదృష్టహీనురాల్ని. దురదృష్టవంతుల్ని బాగుచేసే వారెవ్వరూ లేరు" అని చెప్పింది.

ఇలా వట్టిమాటలతో కాలం గడిచిపోతోందనీ, అంతలోనే గుడికి వెళ్ళిన అవ్వకుమారుడు శంఖచూడుడు కనక తిరిగివస్తే తనకోరిక నెరవేరదనీ అతడు బాధపడ్డాడు. "గరుత్మంతుడు వచ్చేవేళ అయిందా" అని ఆదుర్దాగా అడిగాడు.

"ఆ, వచ్చేవేళ అవుతోంది. అదుగో కనబడుతోందే పెద్దబండ, ఆ బండదగ్గరికి వస్తాడు గరుత్మంతుడు" అని చెప్పలేకచెప్పింది అవ్వ.

అవ్వవద్ద సెలవుతీసుకుని జీమూతవాహనుడు ఎక్కడలేని సంతోషంతో ఆ బండ ఉన్నచోటికి పరుగెత్తుకు వెళ్ళాడు. బండమీద పడుకున్నాడు.

ఆ శిలమీద పడుకోగానే జీమూతవాహనుడికి మేరలేని సంతోషం కలిగింది. ఇన్నాళ్లకుగదా నా కోరిక నెరవేరింది అనుకున్నాడు. అంతలోనే భయం. శంఖచూడుడు ఎక్కడవస్తాడో అని బెదురుచూపులతో అటూ యిటూ చూడసాగాడు.

అలా జీమూతవాహనుడు భయపడుతూవుండగా, హోరుమని పెద్దగాలి వీచసాగింది. ఆ గాలికి చెట్టుచేమలు, పూనకంవచ్చినవాడిలా ఊగాయి. ఆకులు జలజలమంటూ రాలాయి. రెక్కలల్లార్చుకుంటూ పక్షులు నలుమూలలకు పారిపోయాయి.

గరుత్మంతుడు వస్తున్నాడని గ్రహించి జీమూతవాహనుడు ఎంతో సంతోషించాడు. కాని శంఖచూడుడు యింతలో ఎక్కడవస్తాడో అన్నభయం మాత్రం పోలేదు. అతడు రాకూడదని వెయ్యిదేవుళ్లకు మొక్కుకున్నాడు.

గరుత్మంతుడు బండను సమీపించాడు. అమాంతంగా శిలమీద వాలి పడుకున్న జీమూతవాహనుడిని ఆవురువురుమంటూ తినడం మొదలుపెట్టాడు.

కొంతసేపటికల్లా జీమూతవాహనుని శరీరం నెత్తురుముద్ద అయింది. ఎముకలు మాత్రమే మిగిలాయి. ఆ శిల అంతా నెత్తురుతో నిండిపోయింది.

జీమూతవాహనుని తింటున్న గరుత్మంతుడికి సందేహం కలిగింది. 'నేను చాలారోజులుగా పాముల్ని తింటున్నాను. కాని యివాళ ఏదో పొరపాటు జరిగినట్లుంది, ఇతని మాంసం ఎంత రుచిగా వుంది! ఇతడు నాగుడో, మరి ఎవ్వరో తెలీదు. కొంపతీసి పొరపాటు జరుగలేదు గదా' అని మథనపడసాగాడు.

గరుత్మంతుని సందేహాన్ని పసిగట్టాడు జీమూతవాహనుడు. 'పక్షిరాజా! తిను. నిన్నుచూస్తుంటే ఆకలితో వున్నట్టున్నావు. త్వరగాతిని నీ ఆకలితీర్చుకో' అని ప్రార్థించాడు గరుత్మంతుని.

జీమూతవాహనుని మాటలు వినేసరికి గరుత్మంతునికి సందేహం మరీ ఎక్కువయింది. 'ఇతడెవరో మహాత్ముడుగా కనిపిస్తున్నాడు. నన్నుతిను, నన్నుతిను అని ప్రార్థిస్తున్నాడు. పొరపాటు ఏదో జరిగినట్లుంది' అని గరుత్మంతుడు అనుకున్నాడు తినడం నిలిపివేశాడు. ఇంతలో "మోసం జరిగింది, మోసం

జరిగింది. పక్షిరాజా.... నీకు ఆహారంగా పంపబడ్డ నాగుడిని నేను. నన్ను కాపాడడానికి వచ్చిన ఆ దయామయుడు జీమూతవాహనుడు" అంటూ శంఖచూడుడు ఆ శిలవద్దకు రొప్పుతూ రోజుతూ వచ్చాడు.

జీమూతవాహనుని పేరు వినగానే గరుత్మంతుడు దుఃఖసముద్రంలో మునిగిపోయాడు. ఆయన కంటికి లోకమంతా చీకటి కమ్ముకున్నట్టు తోచింది. "అయ్యో; ఎంత పొరపాటుచేశాను, ఎంత పాపాత్ముణ్ణి నేను! దయావీరుడూ మహాత్ముడూ అయిన జీమూతవాహనుణ్ణి నా పొట్టన పెట్టుకున్నాను. కోరిన వస్తువుల్ని కోరిన వెంటనే యిచ్చే కల్పవృక్షాన్నికూడా బీదవారికి దానంచేసిన మహానుభావుడిని నాపొట్టన పెట్టుకున్నాను గదా. మహాపాపం చేశాను" అని యీవిధంగా పశ్చాత్తాపం చెందాడు గరుత్మంతుడు. తన్ను తాను తిట్టుకున్నాడు.

అప్పుడు జీమూతవాహనుడు, "పక్షిరాజా! నన్ను తినవేమయ్యా కండలన్నీఅయిపోయినవా? వట్టిబొమికలే మిగిలాయని తినడం మానుకున్నావా?" అంటూ ఓపిక లేకపోయినా గరుత్మంతుణ్ణి ప్రార్థించాడు. మాట చాలా నీరసంగా వచ్చింది.

పాపం. జీమూతవాహనుడు కొనవూపిరితో బాధపడుతున్నాడు. అతని శరీరంనుంచి నెత్తురు కారుతూనేవుంది. మాట్లాడడానికి కూడా బలం లేదు.

జీమూతవాహనుడు పడుతున్న అవస్థనుచూసి గరుత్మంతుడు దుఃఖించాడు. తాను చేసిన పనికి సిగ్గుపడ్డాడు. మళ్లీ తన్నుతాను తిట్టుకున్నాడు. శంఖచూడుడేమో చిన్నపిల్లవాడిలా ఏడుస్తూ అక్కడే కూర్చున్నాడు.

ఇంతలో ఈ విషయమంతా జీమూతవాహనుని ముసలితల్లిదండ్రులకూ అతనిభార్యకూ తెలిసిపోయింది. వారంతా ఆ బండదగ్గరికి ఏడుస్తూవచ్చారు. వారందరిని చూసి గరుత్మంతుడు. అయ్యో! నా ఒక్కనివల్ల వీరందరికీ యింత కష్టం కలిగింది గదా! ఎలాగైనా సరే జీమూతవాహనుణ్ణి బతికించి, వాళ్ల దుఃఖం పోగొట్టాలి. వాళ్లకు సంతోషం కలిగించాలి. అప్పుడే నాకు మనశ్శాంతి అని అనుకున్నాడు, అనుకోవడమేమిటి, అమృతం తీసుకురావడానికి దేవలోకానికి

బయలుదేరడమేమిటి? ఈరెండూ ఒకేసమయంలో జరిగాయి. అమృతం కనుక మీదచల్లితే చనిపోయినవారుకూడా బ్రతుకుతారు. అందుకనే గరుత్మంతుడు దేవలోకానికి వెళ్లాడు, అమృతంకోసం.

కష్టపడి దేవలోకంనుంచి అమృతం తీసుకువచ్చాడు గరుత్మంతుడు. దాని సహాయంతో జీమూతవాహనుణ్ణి బ్రతికించాడు. అప్పుడు అందరూ ఆనందించారు.

ఆ తర్వాత జీమూతవాహనుడు గరుత్మంతుడితో, 'పక్షిరాజా! దేవలోకానికివెళ్లి కష్టపడి అమృతం తీసుకువచ్చావు. నీ శక్తిసామర్థ్యాలు చాలా గొప్పవి. వాటిని పొగడడానికి నాకు శక్తి చాలదు. నన్ను బ్రతికించినట్లే చచ్చిపడివున్న ఆ పాములన్నింటినీ బ్రతికించి పుణ్యం మూటకట్టుకో అన్నాడు.

అందుకు గరుత్మంతుడు సరే అన్నాడు, అంతే: చచ్చిపడివున్న ఆ పాములన్నీ బ్రతికాయి. అప్పుడు అవి పొందిన ఆనందానికి అంతులేదు.

ఇలా, జీమూతవాహనుడు నాగకులానికి గొప్ప ఉపకారం చేశాడు. ఈ దయావీరుని దివ్యచరిత్ర 'నాగానందం' అనే నాటకంలో చక్కగా చెప్పబడింది, ఇది సంస్కృతంలో ఉంది. దీన్ని హర్షుడు వ్రాశాడు.

----

# మనునీతిచోళుడు

అనగనగా ఒక రాజు, అయనపేరు మనునీతిచోళుడు, అయన ముఖ్య పట్టణం తిరువారూరు. ఇది చోళదేశంలో ఉన్నది. నేటి తంజావూరు, తిరుచిరాపల్లి జిల్లాలనే ఆ రోజుల్లో చోళదేశమనేవారు.

మనునీతిచోళుడు చాలా మంచివాడు. ప్రజలు అయన్ని ఎంతగానో ప్రేమించేవారు; గౌరవించేవారు. అయనకు కూడా ప్రజలంటే చాలా ప్రేమ. వారిని కన్నబిడ్డలవలె చూసుకునేవాడు. ప్రజలంటే ఎంత ప్రేమ చూపేవాడో, నోరులేని ప్రాణులమీద కూడా అయన అంతప్రేమా చూపేవాడు. అలా అందరినీ సరిసమానంగా ప్రేమించిన మహారాజు మనునీతిచోళుడు.

ఆ మహారాజుకి పిల్లలు లేరు. అదే ఆయనకి పెద్దకొరత. సంతానం లేకపోవడంవల్ల, ఆయన సంతోషంగా ఉండేవాడుకాదు. పిల్లలే ఇంటికి అందం. పిల్లల ముద్దుపలుకులే పెద్దలకు సంతోషం. అందువల్ల ఆ మహారాజు ఎప్పుడూ విచారంగా ఉండేవాడు.

మనునీతిచోళుడు గుళ్లు గోపురాలు కట్టించాడు. ఎన్నో తీర్థయాత్రలు చేశాడు. కనిపించని దేవుడికి మొక్కులు చెల్లించాడు. కనిపించిన ప్రతి తీర్థంలోనూ స్నానంచేశాడు. పేదసాదులకు దానధర్మాలు చేశాడు.

చాలాకాలానికి తర్వాత మనునీతిచోళునికి ఒక మగపిల్లవాడు పుట్టాడు. మహారాజు సంతోషించాడు. యువరాజు కలిగినందుకు ప్రజలుకూడా సంతోషించారు.

మహారాజు కుమారుడికి వీధివిటంకుడు అని పేరుపెట్టాడు. వీధివిటం కుడికి ఏం తక్కువని? కావలసినన్ని ఆటవస్తువులు; కావలసినన్ని బొమ్మలు. కొండమీది కోతినికూడా తెచ్చియిచ్చేవాడు తండ్రి. అబ్బురాల బిడ్డగా పెరగసాగాడు.

వీధివిటంకుడు పెద్దవాడయ్యాడు. అన్నివిద్యలూ నేర్చాడు; అన్నిశాస్త్రాలూ నేర్చాడు. అయినా అతనికి ఏ కోశానా గర్వంలేదు. బీదవారినిచూసి నవ్వేవాడు కాదు. మంచివాడని పేరు సంపాదించాడు.

ప్రతిరోజూ సాయంకాలం గుడికివెళ్లి భగవంతుని సేవించేవాడు వీది విటంకుడు. అక్కడ కొంచెంసేపు కూర్చొని పురాణం వినేవాడు. యింటికి వచ్చిన

తర్వాత తండ్రివద్ద రాజనీతి శాస్త్రంనకు సంబంధించిన విషయాలు తెలుసుకునే వాడు.

ఒకనాడు వీధివిటంకుడు రథం ఎక్కి గుడికి బయలుదేరాడు. కొంత మంది సేవకులుకూడా అతనితో బయలుదేరారు.

దారిలో, తలవనితలంపుగ్గా, విచారకరమైన సంఘటన ఒకటి జరిగింది.

రథం వెడుతోంది, ఎక్కడనుంచి వచ్చిందో యేమిటో ఒక ఆవుదూడ వచ్చి అతని రథచక్రాల కిందపడి చచ్చిపోయింది.

చక్రాలకింద ఏదోపడి నలిగిపోయినట్లు వీధివిటంకుడు గ్రహించాడు. వెంటనే రథం ఆపి, కింది కిదిగి చూశాడు. పాపం, దూడ కాస్తా నలిగి నల్లేరయింది. చూడడానికి చాలా అందంగా ఉంది.

చచ్చిపోయిన దూడనుచూస్తూ అలాగే కుప్పలా కూలిపోయాడు వీదివిటంకుడు. అతనికి కాళ్లూ చేతులూ ఆడలేదు. పెదవులు ఎండిపోయాయి.ఎంత ప్రయత్నించినా, మాట పెగలలేదు. కూర్చున్నవాడు అలాగే కూర్చుండి పోయాడు.

వెంటనున్న సేవకులు, కళ్లల్లో నీళ్లుగుక్కుకుంటూ, యువరాజుని చూస్తూ నిలబడిపోయారు.

చచ్చిపోయిన దూడను చూసేకొద్దీ వీధివిటంకుడికి ఆపుకోలేనంత ఏడుపు వచ్చింది. అతి కష్టంమీద, ఇలా అన్నాడు సేవకులతో చివరికి.

"ఎంత పాపకార్యం చేశాను ఇవాళ. నిష్కారణంగా ఈ దూడను నాపొట్టను పెట్టుకున్నాను. భగవంతుడా! నిన్ను సేవించడానికి వస్తూవుండగా ఈ పాపకార్యం జరగవలెనా? ఎక్కడినుంచో వచ్చి యీ దూడ నా రథంకిందే పడవలెనా? నేను ఎంత దురదృష్టవంతుడిని!"

"ఒక్కనిమిషం కనుక నేను యింటికి రావడం ఆలస్యమైతే మా అమ్మ భయపడిపోతుంది. నలుమూలలకూ సేవకుల్ని పంపి నాకోసం వెతికిస్తుంది. పాపం, ఈ దూడతల్లి ఎంత హడలిపోతోందో మరి! చచ్చిపోయిన ఈ దూడను కనక చూస్తే తల్లి ఆవు ఎంతగా ఏడుస్తుందో!ఆ యేడుపునిచూసి నేను భరించగలనా! ఆ ఆవుకేం బదులు చెప్పను?"

"ఈసంగతి తెలిసిందంటే మానాన్న ఎంతగానో బాధపడతాడు. నేనుచేసిన యీ తప్పును క్షమించడు. నావల్ల మా వంశానికి అపకీర్తి వచ్చింది. ఛీ ఛీ, నే నెందుకు పుట్టాను!"

వీధివిటంకుని మాటలువిన్న ఆ సేవకులు భయపడుతూ అప్పుడు యువరాజుతో ఇలా అన్నారు.

"ప్రభూ! ఇందులో మీ తప్పు ఏమీలేదు. ఆ దూడను మీరు చంపాలని చంపలేదు. అది దారితప్పి వచ్చి మీ రథంకింద పడింది. తెలిసి చేస్తే తప్పు. తెలియకుండా చేసింది తప్పుకాదు. కనుక మీరేమీ విచారించకండి. మనం గుడికి వెడదాము రండి."

సేవకుల మాటలు యువరాజుకు నచ్చలేదు. అక్కడే కూర్చుండిపోయాడు. ఇంతలో ఆ దూడను వెతుక్కుంటూ ఒక ఆవు వచ్చింది. అది దాని తల్లి.

తల్లిఆవు దూడచుట్టూ మూడుసార్లు తిరిగింది. 'అంబా,అంబా' అని అరిచింది. దూడమీదుగా రథచక్రాలు పోయిన ఆనవాలు చూసేసరికి దాని కళ్లలో నీళ్లు తిరిగాయి. రథంమీదుగా వెళ్లేటప్పుడు నా బిడ్డ ఎంత యమయాతన పడిందో? అమ్మా అమ్మా అని ఎన్నిసార్లు అరిచిందో? నోరులేని నీపై రథం పోనిచ్చిన ఆ దుష్టుడు ఎవరో? వాడికి చేతులు ఎలావచ్చాయో యీ పని చేసేందుకు? - అని యీలా అనుకుని బాధపడింది.

ఇక ఎంతసేపు ఏడ్చినా లాభం లేదనుకుని కాబోలు ఆవు ఆ చోటు విడిచిపెట్టి సరాసరి రాజుగారి అంతఃపురానికి దారితీసింది.

అప్పటికప్పుడే యీ విషయం ఊరంతా పాకిపోయింది. విన్నవారంతా రాజుగారి న్యాయబుద్ధిని తలుచుకుని'యువరాజుకి ఏం శిక్ష విధిస్తారో యేమిటో! ఎంతకష్టం వచ్చిపడింది' అని కంట తడిపెట్టారు.

అంతఃపురం చేరిన ఆవు సరాసరి మనునీతిచోళమహారాజు నివసించే మందిరంవద్దకు పోయి ఆగింది. మందిరద్వారందగ్గర ఒకపెద్ద గంట వ్రేలాడు తోంది. అది ఆ గంటను మోగించింది. ఆ మోతను వినగానే మహారాజు తల్లడిల్లి పోయాడు. ఎవరికి ఏం ఆపద వచ్చిందో అని ఆయన భయపడ్డాడు.



ఆ మరుక్షణమే మనునీతిచోళుడు ఆవువద్దకు వచ్చాడు. ఆయనవెంట మంత్రికూడా ఉన్నాడు.

ఆవుని చూడగానే చాలా జాలి కలిగింది. కాని అది యెందుకు వచ్చిందో. దానికి వచ్చిన ఆపద యేమిటో ఆయనకి అర్థంకాలేదు.

ఆవు అంబా అని అరచింది.

ఏమిటి అన్నట్లుగా మహారాజు మంత్రివైపు చూశాడు.

జరిగిన సంగతి మంత్రికి తెలుసు. కాని రాజుగారితో ఆ విషయం చెప్పి, ఆయన మనస్సుని నొప్పించడానికి ఇష్టపడలేదు. అందువల్ల తాను విన్నదాన్ని తనలోనే దాచుకున్నాడు.

ఆవు మళ్లీ అంబా అని అరిచింది.

మహారాజు కొంచెం కఠినంగా మంత్రివైపు చూశాడు, అప్పుడు మంత్రి చెప్పలేక చెప్పలేక జరిగిన విషయాన్ని వివరించాడు.

అంబా అంటూ ఆవు అక్కడినుండి వెళ్ళిపోయింది.

మనునీతిచోళుని కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. 'ఏం చేద్దాం' అన్నట్లుగా ఆయన మంత్రిని చూశాడు.

"ప్రభూ! ఇందులో యువరాజుగారి తప్పు ఏమీలేదు. ఇదంతా దుర్విధి ప్రభావం. లేకపోతే ఎక్కడెక్కడో తిరిగే దూడ యువరాజు రథంకిందే పడి మరణించాలా! గుడికి బయలుదేరిన యువరాజుగారికి ఈ అపకీర్తి రావాలా? అంతా దుర్విధి" అన్నాడు మంత్రి.

"సరే.....దూడ మరణించినమాట నిజమే గదా?" అని రాజు అడిగాడు.

"నిజమే ప్రభూ"

ఎలా చనిపోయిందన్నారు?"

"యువరాజుగారి రథంక్రింద పడి అది మరణించింది"

"అయితే దూడను చంపినవాడికి తగినశిక్ష విధించవలసిందే."

అప్పుడు మంత్రి ఇలా అన్నాడు.

"ప్రభూ! యిందులో యువరాజుగారు తప్పుచెయ్యలేదనే నా నమ్మకం. అంతా విధివశాత్తు జరిగింది. కనక యువరాజుగారిని శిక్షించడం మంచిదికాదని మనవి.

మంత్రి మాటలు మహారాజుకి నచ్చలేదు. "మంత్రిగారూ, మీ మాటలు విచిత్రంగా వున్నాయి . తప్పు చేసినవాడిని శిక్షించడమే రాజధర్మం. తప్పు చేసినవారు ఎవరైనా సరే, వారిని తప్పక శిక్షించవలసిందే. న్యాయం విచారించేటప్పుడు కొడుకనీ, కూతురనీ భేదం చూపకూడదు. న్యాయందృష్టిలో అందరూ సరిసమానమే . నోరులేని ప్రాణికికూడా మనం న్యాయం చెయ్యాలి." అని మనునీతిచోళుడు అన్నాడు.

యువరాజుకి శిక్ష తప్పదని మంత్రి నిశ్చయించుకున్నాడు.

తర్వాత మహారాజు వీధివిటంకుని మీదుగా రథమును పోనిచ్చి, అతనిని చంపవలసిందని మంత్రిని ఆజ్ఞాపించాడు.

ఆ మాటవిని మంత్రి ఉలిక్కిపడ్డాడు. అయినా రాజుగారి ఆజ్ఞను అక్షరాలా పాటించవలసిందే. లేకపోతే రాజాజ్ఞను మీరినట్లవుతుంది. పాపం, మంత్రి అవస్థలో పడ్డాడు. ముందు నుయ్యి, వెనక గొయ్యి.

దూడ చచ్చిపడివున్నచోటికి వెళ్ళాడు మంత్రి. యువరాజుమీదుగా రథం పోనివ్వడానికి మంత్రికి మనస్కరించలేదు. తనచేతులతో యువరాజుని చంపడానికి ఇష్టపడని మంత్రి తన కరవాలంతో తన్నుతాను పొడుచుకొని కన్నుమూశాడు, తనవల్ల మంత్రి మరణించినందుకు యువరాజు విలపించాడు.

మంత్రి మరణవార్త మహారాజుకి తెలసింది. ఆయున మిక్కిలి పరితపించాడు.

నోరులేని ఆవుదూడను చంపినందుకు వీధివిటంకుని చంపవలెననీ, తనమూలంగా మంత్రి మరణించినందుకు తన్నుతాను చంపుకోవలెననీ మను నీతిచోళుడు నిశ్చయించుకున్నాడు.

ఈ విషయం అంతఃపురంలోని వారందరికీ తెలిసింది. అందరూ దుఃఖించారు. ఇది పట్టణమంతా వ్యాపించింది. విన్నవారంతా విలపించారు.

నిష్కారణంగా ఆవుదూడను చంపినందుకు తనకు తగినశిక్ష లభించిందని వీధివిటంకుడు చాలా సంతోషించాడు. రవ్వంతైనా విచారించలేదు. పైపెచ్చు తన తండ్రి న్యాయబుద్ధినీ భూతదయనూ తలుచుకొని సంతోషించాడు. దూడ చచ్చిపోయినచోట అతడు వెల్లికిల పడుకున్నాడు. తన తండ్రిరథం ఎపుడెపుడు తనమీదుగా వెడుతుందా అని ఎదురుతెన్నులు చూడసాగాడు.

అంతలో మనునీతిచోళమహారాజు రథం అక్కడికివచ్చి నిలిచింది. కన్న కుమారుడిని, అందులోనూ లేక లేక పుట్టిన ఒక్కగానొక్క కొడుకుని చేతులారా చంపుకోడానికి ఏ తండ్రీ సిద్ధపడడు. వీధివిటంకుడు వెల్లికిల పడుకునివుండడం చూసేసరికి మహారాజుకి మొదట్లో ఏడుపువచ్చింది. గాని ఎలాగో ఆ యేడుపుని అణుచుకుని రాజు గుండె రాయి చేసుకున్నాడు.

ఆ తర్వాత మహారాజు వీధివిటంకుని మీదుగా రథాన్ని వేగంగా పోనిచ్చాడు. రథచక్రాలకింద నలిగి నల్లేరయిపోయాడు వీధివిటంకుడు. అక్కడ గుమికూడిన ప్రజలు ఆ దృశ్యం చూడలేక కళ్ళు మూసుకున్నారు.

మహారాజు రథం దిగాడు. తళతళమెరిసే తన కరవాలమును ఒరలో నుంచి పైకితీశాడు. ఆ కత్తితో తనకంఠం ఛేదించుకోవాలని ప్రయత్నించాడు.

ఆ దృశ్యంచూచి ప్రజలు 'ప్రభూ, ప్రభూ' అంటూ పెద్దపెట్టున ఏడవసాగారు. అయినా రాజు తన నిశ్చయాన్ని మార్చుకోలేదు. 'ప్రభూ, ప్రభూ' అంటూ ప్రజలు కేకలు పెడుతూనే వున్నారు. మనునీతిచోళుడు కత్తి పైకి ఎత్తాడు.

అప్పుడు ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. అక్కడ చేరిన జనులు జయజయ ధ్వానాలు చేశారు సంతోషం పట్టలేక, మనునీతిచోళుడు ఎత్తినకత్తిని కిందికిదించి ఈశ్వరుని పాదాలమీద వ్రాలాడు.

రాజుని శివుడు పైకి లేవనెత్తి "రాజా ! నీ భూతదయను చూసి చాలా సంతోషిస్తున్నాను. నీ న్యాయబుద్ధిని భూతదయనూ పరీక్షించడానికే నేనిలా చేశాను." అంటూ మనునీతి చోళమహారాజుని కొనియాడాడు.

మహారాజు కరవాలాన్ని అవతల పారవేసి, రెండుచేతులు జోడించి, "అంతా మీ దయ. నాలో ఏమున్నది" అన్నాడు భక్తిపూర్వకంగా.

రాజు కనబరచిన భక్తిభావానికి మెచ్చుకుంటూ ఈశ్వరుడు " రాజా! చచ్చిపోయిన ఆవుదూడ బతుకుతుంది. నీ కుమారుడుకూడా జీవిస్తాడు. నీ మంత్రీ జీవిస్తాడు, నీ భూతదయా, నీ న్యాయబుద్ధీ నిన్నూ నీ ప్రజలనూ కాపాడుతాయి" అన్నాడు.

ఆ తర్వాత శివుడు మాయమయ్యాడు. ఆ మరుక్షణమే చచ్చిపోయిన ఆవుదూడకు ప్రాణం వచ్చింది. తోక ఎగరవేసుకుంటూ అది తల్లివద్దకు వెళ్లింది. తల్లిఆవు అంబా అంబా అంటూ అరిచింది.

కరవాలంతో తన్నుతాను పొడుచుకొని మరణించిన మంత్రీ జీవించాడు. మహారాజుకి కలిగిన సంతోషానికి మేరలేదు.

వీధివిటంకుడు కూడా నిద్రనుంచి లేచినవాడివలె, నవ్వుతూ పైకిలేచాడు. వెంటనే మనునీతిచోళుడు అతనిని కౌగలించుకుని, "నువ్వు నా బంగారుతండ్రివి " అని ముద్దు పెట్టుకున్నాడు. తండ్రీకొడుకుల కళ్లనుంచి ఆనందబాష్పాలు రాలాయి.

ప్రజలకు చెప్పనలవికాని సంతోషం కలిగింది. భూతదయా, న్యాయబుద్ధీకల మహారాజు తమకు ప్రభువుగా లభించినందుకు ఎంతగానో సంతోషించారు. గర్వించారు.

# నామదేవుడు

పూర్వం పండరీపురం అనే ఊరిలో ఒక గొప్పభక్తుడు ఉండేవాడు. ఆయన పేరు నామదేవుడు.

నామదేవుడికి పాండురంగడంటే చాలాభక్తి. ఆ దేవుడే ఆయన ఇష్టదైవం. అన్నం తినేటప్పుడు కూడా. 'పాండురంగా' అని ఎంతోభక్తితో ఆ దేవుణ్ణి స్మరించేవాడు. నిద్రలోకూడా ఆ దేవుణ్ణి తలచేవాడు. ఆ దేవుడంటే అంతభక్తి నామదేవుడికి.

పాండురంగని పవిత్రనామమును కనుక భక్తితో స్మరిస్తే చేసిన పాపము లన్నీ తొలగిపోయి పుణ్యం కలుగుతుందని నామదేవుని నమ్మకం.

నామదేవుని భక్తినిచూసి పాండురంగడు చాలా మెచ్చుకున్నాడు. భగవంతుడు దయాసముద్రుడు ! ఆయనకి భక్తులంటే చాలా ప్రేమ. చాలా గౌరవం. తన భక్తులను భగవంతుడు అన్నివేళలలోనూ కంటికిరెప్పలా కాపాడుతూ వుంటాడు.

నామదేవుని భూతదయను పరీక్షచేయాలని ఒకనాడు పాండురంగడు అనుకున్నాడు. భక్తుల అదృష్టం పండినప్పుడే సాధారణంగా వారిని భగవంతుడు పరీక్షచేయాలని అనుకుంటాడు. నామదేవుడికికూడా ఆ గొప్ప అదృష్టం కలిగింది.

పాండురంగడు ఒక కుక్కరూపం ధరించాడు. ఆ కుక్క పండరీపురంలో నామదేవుడు నివసించే వీథిలో అటూ ఇటూ తిరగసాగింది.

ఆ కుక్క ఒకఇంట్లోకి వెళ్ళింది. ఆ యింటివారు దాన్నికొట్టి బయటికి తరిమివేశారు. ఆ తర్వాత అది మరో యింట్లోకివెళ్లి, అక్కడఉన్న భోజన పదార్థాలను నోటకరుచుకుని గబగబ వీధిలోకి పరుగెత్తుకుని వచ్చింది. కాని ఆ యింటివారు కొట్టిన దెబ్బలను సహించలేక ఆ కుక్క నోట్లోఉన్న వస్తువుల్ని కింద పడేసింది. కుఁయ్ కుఁయ్ అంటూ ఏడవసాగింది. దానికి చావుదెబ్బలు మాత్రమే మిగిలాయి. ఆకలికి అది నకనకలాడిపోయింది. ఎవ్వరూ దానికి గుప్పెడుమెతుకులు కూడా పెట్టలేదు. అదేం చిత్రమోకాని, చూసినవారంతా ఆ కుక్కను చావ చిదుకబాదారు.

ఆ కుక్క నామదేవుడి కంటబడింది. దాని అదృష్టం పండింది.

కుక్కను చూడగానే నామదేవుడికి దానిమీద ఎక్కడలేని దయా జాలీ కలిగాయి. వెంటనే ఇంట్లోకివెళ్ళి ఒకఅరిసె తీసుకువచ్చాడు. అరిసెను చూపుతూ 'రా,రా' అని ఎంతో ప్రేమతో కుక్కను పిలిచాడు. పెంపుడుకుక్క మాదిరిగా, అది

నామదేవునివద్దకు వచ్చింది. తోకను ఆడిస్తూ ఆయనవద్దఉన్న అరిసెను నోట కరుచుకుని పరుగె7త్తింది.

ఆశ్చర్యం! అప్పుడు ఏ మూలచూచినా నామదేవుడికి పాండురంగడు కనిపించాడు. ఆ కుక్కకూడా పాండురంగడనే అనుకున్నాడు నామదేవుడు. అలా అనుకున్నాడో లేదో, కుక్కమీదఉన్న దయ భక్తిగా మారిపోయింది.

'అయ్యో నా స్వామికి నే నెంత అపచారం చేశాను. రుచీపచీలేని అరిసెను నా స్వామికి పెట్టాను. నేతిలో అద్దుకుంటూ కనక తింటే అరిసె చాలారుచిగా ఉంటుంది అని అనుకున్నాడు మనస్సులో.

ఇలా అనుకున్న నామదేవుడు చరచర లోపలికివెళ్లి నేతిగిన్నెతో వీధిలోకి తిరిగివచ్చాడు.

నేతిగిన్నెను పైకిఎత్తి చూపిస్తూ నామదేవుడు, 'స్వామీ! పాండురంగా! అపచారం జరిగింది. ఇలా రండి. ఈ గిన్నెలో కమ్మనినెయ్యి వుంది. నేతిలో కనక అద్దుకుని తింటే అరిసె ఎంతో రుచిగా ఉంటుంది' అని బిగ్గరగా చెప్పాడు; కేకలు వేశాడు.

ఆ కేకలకు ఇరుగుపొరుగుల ఉన్నవారంతా అక్కడికి వచ్చారు. నామదేవుడివైపు ఎగాదిగా చూశారు. ఆయనకి పిచ్చిఎక్కిందని చివరికి వారనుకున్నారు.



ఎంత పిలిచినా, కుక్క తనవద్దకు రాకపోవడంవల్ల నేతిగిన్నెతో నామదేవుడు కుక్క ఉన్నచోటికి పరుగెత్తుకు వెళ్ళాడు. దాని నోట్లోఉన్న అరిసెను బయటికితీశాడు. దాన్ని చిన్నచిన్న ముక్కలుచేశాడు. ఒక్కొక్కముక్కను నేతితో అద్ది, దానిని కుక్కకు భక్తితో పెట్టసాగాడు. తోక ఆడిస్తూ, నామదేవుడు అందించే అరిసెముక్కల్ని కుక్క సంతోషంగా తినసాగింది.

ఈ చోద్యంచూసి అక్కడ గుమిగూడినవారంతా పొట్టలు చెక్కలయ్యేటట్టు నవ్వారు.

చిన్నపిల్లలు మొదలుకొని పెద్దవాళ్లదాకా అందరూ నామదేవుణ్ణిచూసి నవ్వినవాళ్ళే. ఆయనకు నిజంగా పిచ్చెక్కిందని వాళ్లు అనుకున్నారు.

అరిసెముక్కలన్నీ అయిపోగానే, కుక్క నామదేవునిచూట్టూ తిరగసాగింది. అలా తిరుగూతూ తిరుగుతూ అది ఎవ్వరికీ కనిపించకుండా మాయమైపోయింది.

అప్పుడు నిజంగా పిచ్చెక్కినవాడివలె నామదేవుడు "పాండురంగా పాండురంగా" అంటూ ఆ కుక్కకోసం అటూఇటూ పరిగెత్తాడు. "నా పాండురంగడు ఎక్కడికి వెళ్ళాడు? నా స్వామీ ఇంతలోనే ఎక్కడికి వెళ్ళావు? అని కేకలు వేశాడు.

ఈ వింతను చూస్తూవున్న పిన్నలూ పెద్దలూ అందరూ అది నిజంగా కుక్కకాదనీ, పాండురంగడే అలా కుక్కరూపంలో వచ్చాడనీ, నామదేవుడు గొప్ప భక్తుడనీ అనుకున్నారు. భగవంతునియందు, భక్తునియందు తీరని అపచారం చేసినందుకు వాళ్ళంతా పశ్చాత్తాపం చెందారు. మొదట నామదేవుడినిచూసి నవ్విన వాళ్ళందరూ చెంపలువేసుకుంటూ వచ్చి ఆ దయావీరుని పాదములమీద వాలారు!

----

రాము – మైథిలీ! మనము పూర్వము నివసించిన జనస్థాన మిక్కడనే యున్నది. యెఱుఁగుదువా! నీవు బిడ్డలవలెఁ బెంచినచెట్లు నీకు జ్ఞాపకమున్నవా?

సీత – ఎఱుఁగు దెఱుఁగుదు. అవి దట్టముగ నాకులు బట్టి దలపైకెత్తి చూడఁదగినంతయె త్తైనవి.

రాము – అది యెట్లే. కాలము పల్లము మెఱకగను, మెఱకను బల్లముగను జేయునదిగదా! ఈయేడాకులయరఁటి చెట్టుక్రిందఁ దెల్లనిబట్టలఁ గట్టుకొని కూర్చుండిన భరతునిఁ జూచి లేడులగుంపు బెదరినది. అది నీకు జ్ఞప్తికి వచ్చినదా?

సీత – ఆర్యపుత్రా! లెస్సగా జ్ఞాపకమున్నది.

రాముఁడు – ఇదిగో! మనతపస్సునకు సాక్షిభూతమ్మైన పచ్చికబయలు. అక్కడ మనము గూర్చుండి నాయనగారి శ్రాద్ధక్రియను గూర్చి యాలోచించు చుండఁగా గాంచనపార్శ్వమను లేడిగనఁబడినది.

సీత – అయ్యో! ఆర్యపుత్ర! వద్దు. ఆమాట చెప్పవద్దు. (ఆనిజడిసి వడఁకు చున్నది.)

రాము – భయపడకు. భయపడకు. ఆకాల మతిక్రమించినది (దిక్కులు చూచి) ఏమిది? ఎక్కడనుండియో

*తే.గీ.* *తెల్లనై లొద్దుగయుఁబోలెఁ దిసలఁ గ్రమ్మి*
*వాయువులచేత దుమ్మదె వచ్చుచుండె*
*నమితదుందుభిధ్వనులలో నడగిశంఖ*
*రవము వనమును హా! నగరంబుఁ జేసె.*

లక్ష్మణుఁడు – (ప్రవేశించి అన్నయ్యా! జయము.)

*తే.గీ.* *ఈమహాసేన దనవెంట నేగుదేర*
*భ్రాతృవత్సలుఁ డైనట్టి భరతుఁ డిపుడు*

రాము - మైథిలీ! మనము పూర్వము నివసించిన జనస్థాన మిక్కడనే యున్నది. యెఱుఁగుదువా! నీవు బిడ్డలవలెఁ బెంచినచెట్లు నీకు జ్ఞాపకమున్నవా?

సీత - ఎఱుఁగు దెఱుఁగుదు. అవి దట్టముగ నాకులు బట్టి దలపైకెత్తి చూడఁదగినంతయె త్తైనవి.

రాము - అది యెట్లే. కాలము పల్లము మెఱకగను, మెఱకను బల్లముగను జేయునదిగదా! ఈయేడాకులయరఁటి చెట్టుక్రిందఁ దెల్లనిబట్టలఁ గట్టుకొని కూర్చుండిన భరతునిఁ జూచి లేడులగుంపు బెదరినది. అది నీకు జ్ఞప్తికి వచ్చినదా?

సీత - ఆర్యపుత్రా! లెస్సగా జ్ఞాపకమున్నది.

రాముఁడు - ఇదిగో! మనతపస్సునకు సాక్షిభూతమ్మైన పచ్చికబయలు. అక్కడ మనము గూర్చుండి నాయనగారి శ్రాద్ధక్రియను గూర్చి యాలోచించుచుండఁగా గాంచనపార్శ్వమను లేడిగనఁబడినది.

సీత - అయ్యో! ఆర్యపుత్ర! వద్దు. ఆమాట చెప్పవద్దు. (ఆనిజడిసి వడఁకుచున్నది.)

రాము - భయపడకు. భయపడకు. ఆకాల మతిక్రమించినది (దిక్కులు చూచి) ఏమిది? ఎక్కడనుండియో

*తే.గీ.* *తెల్లనై లొద్దుగయుఁబోలెఁ దెసలఁ గ్రమ్మి*
*వాయువులచేత దుమ్మదె వచ్చుచుండె*
*నమితదుందుభిధ్వనులలో నడగిశంఖ*
*రవము వనమును హా! నగరంబుఁ జేసె.*

లక్ష్మణుఁడు - (ప్రవేశించి అన్నయ్యా! జయము.)

*తే.గీ.* *ఈమహాసేన దనవెంట నేగుదేర*
*భ్రాతృవత్సలుఁ డైనట్టి భరతుఁ డిపుడు*